# కుంతి

రచన:

డాక్టర్ సి. వి. సుబ్బన్న శతావధాని

ప్రధానసంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:

శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1982

T. T. D. Religious Publications Series No. 142

SRINIVASA BALABHARATI – 23



( Children Series )



# KUNTI



by Dr. C. V. Subbanna

*Chief - Editor :*
Dr. S. B. Raghunadhacharya

Vijaya Dasami
Dundubhi, 1982.
Copies 10,000
Price 1–00

*Published by :*
Sri G. Kumaraswami Reddi, I.A.S.,
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.




Art : SILA VIRRAJU
CHAYA

Printed at :
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

ఒకతోట అందంగా కనులకు విందుచేయాలంటే, ముందు అందులోని పూలమొక్కల్ని చక్కగా పెంచాలి. సమాజం సుందరంగా రూపొందాలంటే భావిభారత పౌరులైన బాలలు సంస్కారంతో పెరగాలి. మనసంస్కృతి గొప్పదనం వారికి తెలియనంతకాలం వారెన్ని విద్యలు సాధించినా ప్రయోజనం శూన్యం. "మహాపురుషులు, మహాపతివ్రతలు మనజాతికెందుకు గర్వకారణమైనారు? వారినుంచి మనం ఏ ఆదర్శాన్ని నేర్చుకోవాలి?" అనే విషయాన్ని వారి కథను చెబుతూ మన చిన్నారి బాబులకు, పాపలకు చెప్పగలిగితే వారికి మనమెంతో సంస్కృతీసంపదనిచ్చిన వారమౌతాం. అలా సంస్కారంతో పెరిగిన బాలలు, తమ జీవితంలో ఎంతో మంచివి పెంచుకొని ఈ సమాజానికి ప్రేమను పంచుతారు. ఉత్తమ పౌరులై వారి కుటుంబానికేకాక, ఈ దేశానికిగూడ పేరు ప్రతిష్ఠలను సంపాదిస్తారు.

తిరుమల తిరుపతి దేవస్థానం, ఇలాంటి ఉద్దేశ్యంతోనే ఈ "శ్రీనివాసబాలభారతి" అనే పుస్తకమాలను చిన్నపిల్లలకోసం ప్రకటిస్తున్నది. దీన్ని 'బాలభారతి' అని పిలిచినా పెద్దవాళ్ళకు గూడ ఎంతో విజ్ఞానాన్నందిస్తూ ఇది ప్రతికుటుంబాన్నీ ఆకర్షిస్తు

వ్నది. చక్కని ఆదర్శం కలిగి, చరిత్ర ప్రసిద్ధిపొందిన మహా పురుషుల, మహాపతివ్రతల కథలు ఇందులో చిన్న చిన్న వాక్యాల్లో చెప్పడం జరుగుతుంది. ఈ బాలసాహిత్యాన్ని చిన్నారిపాపలు బాగా చదివి ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ బాలసాహిత్య ప్రణాళికను చక్కగా రూపొందించి, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డి నేటర్, పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికలో ఎందరో రచయితలు కళాకారులు సహకరిస్తు న్నారు; వారందరికి నా ధన్యవాదాలు.

విజయదశమి
27—10—82

జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక – ధార్మికాదర్శాలకు పేరుపడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతి మానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి,' 'ఇది తర తరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం', 'ఇది నా కర్తవ్యం' అని ప్రతి బాలుడు, బాలిక, ఈ దేశసేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహానుభావులు, మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్రవ

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్లను అర్థంచేసుకోవడం, వాళ్ల చరిత్ర మన నంచేసుకోవడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందతో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం. బాలలూ! రండి! రండి!

విండు మనస్సుతో మీ కిదే మా స్వాగతం!

విజయదశమి
27–10–1982

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

విసీ వినకుండానే ఆదుర్దాతో అందరికీ చెప్పేసేవారు కొందఱు. అవసరం వచ్చినప్పుడు మాత్రమే బయటపడే వారింకొందఱు. ఏ పరిస్థితిలోను లోపలివిషయాన్ని బయటకు రానీయనివారు మఱి కొందఱు. విచిత్రమైంది ఈ లోకం. "నువ్వుగింజ కూడ నోట్లో నానదు" అనే సామెత ఇందులో మొదటివారి కోసం పుట్టింది. అందఱు అంతే అని అనలేం కాని, ఆడవాళ్లల్లో ఇది కొంతకు కొంత సార్థకం.

దీనికి విరుద్ధంగా మన ఇతిహాసంలో ఒక గంభీరస్త్రీమూర్తి కనబడుతుంది. అతడు తన కొడుకేనని బాగా తెలుసు. అయినా అతని పరాక్రమాన్ని నలుగురిలో మెచ్చుకోలేదు. అతడు మీ అన్న అని మిగత సంతానంతో చెప్పుకోనూ లేదు. ఏం ప్రయోజనం? అంతా జరిగిపోయింది. చివఱకు అతడు రణరంగంలో నేల కూలినప్పుడు 'వాడు మీ అన్న' తర్పణం చేయమంటుంది. అబ్బ! ఎంత గాంభీర్యం! ఇంతటి రహస్యాన్ని దాచిన తల్లిని చూసి కొడుకులు

...శ్చర్యపోతారు. 'స్త్రీలకు రహస్యం దాచే శక్తి ఇక ఉండకూడద'ని ధర్మస్వరూపి పెద్దకొడుకు ఆమెను శపిస్తాడు. ఆమె ఎవరో తెలుసా? పాండవుల తల్లి కుంతి.

అందుబాటులో ఉన్న భోగభాగ్యాలను లెక్కచేయక, గుడ్డి దంపతులకు సేవచేస్తూ వనవాసం చేసిన ఆమె విరక్తి, శాంతి మన దృష్టిలో ఉండాలి. ఇక చదవండి.

— ప్రధానసంపాదకుడు.

# కుంతి

**కుంతి అంటే :**

కుంతి యాదవుల ఆడుబిడ్డ. వసుదేవుని చెల్లెలు. శ్రీకృష్ణుని మేనత్త. ఆమె అసలు పేరు పృథ. కుంతిభోజు డనే రాజు సంతానం లేక, యీామెను పెంచుకొన్నాడు. అందుచేత ఈమె కుంతి అయింది.

**బాల్యం :**

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. కుంతి చిననాడే చాలా బుద్ధిమంతు రాలనిపించుకొంది. ఆమెను చూస్తే పెద్దలకు ముద్దు వచ్చేది. ఆమె దైవభక్తి, గురుభక్తి, మెచ్చుకోదగ్గవి. ఆ యింట్లో కుంతి అంటే ఎంతో అను రాగం వెల్లి విరిసేది. కుంతిభోజుడు కొత్తవాడు కాడు; తమ తండ్రి మేనత్తకొడుకే. కనుక ఆమెకు చనవు కూడ కావలసినంత వుండేది. తమ యింటికి ఎవరైనా పెద్దలు

వస్తే కుంతిభోజుడు కూతురును పిలిచి, ఆమెచేత వారికి పాదాభివందనం చేయించేవాడు. పరిచర్య చేయించేవాడు. ఆశీర్వదించమని అర్థించేవాడు. ఇలా కాలం గడుస్తూవుంది. చంద్రరేఖ వలె కుంతీకన్య వర్ధిల్లుతూ వుంది.

**నీ ఓర్పుకిది గీటురాయి:**

ఒకనాడు కుంతిభోజుడు కొలువై వున్నాడు. ఆకస్మికంగా దుర్వాసుడనే ఋషి అక్కడకు వచ్చాడు. ఆయన రుద్రాంశసంభవుడు. ఆయన్ను చూస్తే అందరికీ భయమే. ఆయనకు కోపం ముక్కుమీదే వుంటుంది. ఆయన శపిస్తే తిరుగులేదు. అలాంటి చండ ప్రచండుడైన ఋషికి ఆతిథ్యమివ్వాలి. సపర్య చెయ్యాలి. ఆ భారం కుంతిమీద పడింది. తండ్రి బిడ్డశిరస్సు నిమురుతూ 'తల్లీ! నీ ఓర్పుకిది గీటురాయి' అన్నాడు. కుంతి ఆనందంతో అరమోడ్పు కన్నులతో — 'నాన్నా! మహర్షులకు సేవ చేసే భాగ్యం అందరికీ కలిసి వస్తుందా?

దుర్వాసుని సేవ నా జీవితానికి వెలుగుబాట, అంటూ మ్రొక్కి తండ్రిదీవెనలు పొందింది.

దుర్వాసుని మంత్రోపదేశం :

దుర్వాసుడు కుంతిభోజుని యింట ఒక యేడాది కాలం ఉన్నాడు. ఆయన యెప్పుడు ఎక్కడకు వెళతాడో, యే వేళకు తిరిగి వస్తాడో యెవరికీ తెలియదు. ఒక్కొక్క సారి ఫలానా ఆశ్రమానికి వెళుతున్నాను. రేపు సాయం వేళకు తిరిగి వస్తాను అని చెప్పి వెళ్ళి, ఆ రోజే అర్ధరాత్రికి తిరిగి వస్తాడు. వచ్చాడంటే, రానీలే, అక్కడ మంచి నీళ్ళున్నాయి. చాప వుంది. త్రాగి పడుకొంటాడు అను కోవడానికి వీల్లేదు. ఫలహార మేమైనా వుందా? అంటాడు. పండ్లు గట్టిగా వుంటే పచ్చివంటాడు. మెత్తగా వుంటే కుళ్ళిన వంటాడు. విసిరి మొగాన కొడతాడు. అలాంటి మహానుభావునికి కుంతి పరిచర్యచేసింది. ఓర్పులో భూదేవి వంటి దనిపించుకొంది. మునీశ్వరుని మనసు కరిగింది. 'బిడ్డా! నీ పరిచర్య నా కెంతో సంతోషం కలిగించింది.

నీకేమి కావాలో అడుగు ఇస్తాను.' అన్నాడు. కుంతికి ఏ కోరికా లేదు. అవ్యాజంగా సేవ చేసింది. 'మహాత్మా! నాకు కావలసిందేముంది? మీరు ప్రసన్నులయ్యారు. అదే నాకు పదివేలు. మా తండ్రి సంతోషిస్తాడు.' అని నమస్కరించింది. ముని ఇలా అన్నాడు – 'నీవు పసిదానవు. నీకు తెలియదు. అడుగలేకున్నావు. నీకొక మంత్రమిస్తాను. తీసుకో. నీవు ఏ దేవునిపిలిస్తే ఆ దేవుడు నీదగ్గరకువస్తాడు. నీ కోరికలిస్తాడు'. కుంతి మారాడకుండా మహాప్రసాదమని మంత్రం స్వీకరించింది. కుంతికి మంత్రోపదేశం చేసి, కుంతిభోజుని ఆశీర్వదించి, దుర్వాసుడు తన దారిన తాను వెళ్లాడు.

**కోరిన వెంటనే :**

నవయౌవనశ్రీతో నాలుగంచులా విరిసిన పద్మంలా కుంతి కాంతి వెదజల్లుతూ కూర్చుండి, ఒకనాడు ప్రొద్దు పొడుపు శోభ చూస్తూ వుంది. ఆమె హృదయంలో రాగ మధువు తొణికింది. 'ఓహో! సూర్యభగవానుని మూర్తి

ఎంతసుందరంగా వుంది. స్వామీ! సహజ కుండలాలతో. వజ్రకవచంతో, మిరుమిట్లు గొలిపే తేజస్సుతో నీ లాగే చూడ ముచ్చటగా వుండే ఒక కొడుకును నాకు ప్రసాదిస్తావా? అంటూ అప్రయత్నంగా దుర్వాసుడిచ్చిన మంత్రం జపించింది. సంకల్పమాత్రాన సరసిజమిత్రుడు సన్నిహితుడయ్యాడు. ఎంతో సౌమ్యంగా ప్రసన్నంగా వున్నాడు. ఆ దివ్యపురుషుని చూచి కుంతి భయపడింది. పారిపోవాలని చూచింది. 'బాలా! భయపడకు! నేను నీవు కోరిన వరమీయడానికే వచ్చాను, అంటూ బుజ్జగిస్తూ రవి సమీపించాడు.

కుంతి వణకుతూ చేతులుజోడించి, 'స్వామీ! ఒక బ్రహ్మవిదుడు నాకీమంత్రముపదేశించాడు. మంత్రశక్తి నాకుతెలియదు. చూస్తామని ఊరకే ఉచ్చరించాను. ఇంత పని జరుగుతుందనుకోలేదు. అజ్ఞానంతో ఈ పనిచేశాను. నన్ను మన్నించు' అని ప్రణామం చేసింది. పద్మబంధుడు వినలేదు. 'నా దర్శనం వృథాకాదు. నీ అభిమతం

నెరవేరుస్తాను అన్నాడు. 'అయ్యో! నేను కన్యను. నేను గర్భవతినైతే, తల్లితండ్రులు చుట్టపక్కాలు నన్ను చూచి నవ్వుతారు. నేను బ్రతకలేను. నన్ను రక్షించు' మంటుంది కుంతి. అప్పుడాకర్మసాక్షి, 'కమలాక్షీ! నీకన్యాత్వం చెడదు. నీకు లోకాపవాదం రాదు. నేను వరమిస్తున్నాను. ఇక మాట్లాడవద్దు' అని ముందుకు వచ్చాడు. కుంతి 'సత్యం, ధర్మం పాలించే ప్రభుడవు నీవు. నీకిది ధర్మమని తోస్తే, చేయి, నేనింక మాట్లాడను' అని పారవశ్యం పొందింది. అంశుమంతుడు కుంతి అభిలషితం తీర్చి అంతర్హితుడయ్యాడు.

**ఇప్పుడేం చేయాలి:**

కుంతీభాస్వంతుల సమాగమఫలం కర్ణుడు. శిశువు కలిగాడు. వానిచెవులకు పుట్టుకతోనే రత్నకుండలా లున్నాయి. శరీరమంతా వజ్రకవచమయం. రెండవ సూర్యునిలాగున్నాడు. కుంతికి కళ్ళుతిరిగినై. మతి పోయింది. ఇటువంటిబిడ్డ లోకంలో ఎవరికైనా జన్మి

స్తాడా? నాకు జన్మించాడు. ఇది నాభాగ్యమనుకో వలెనా? పెండ్లికాని కన్యను నేను. వీడు నాకొడుకని చెప్పుకోలేను. ఏమిచేయాలి? అని లోలోపల కుమిలి పోయింది. లోకాపవాదభయం దావాగ్నిలా ఆమెను చుట్టుముట్టింది. ఆమె మనస్సులో ఒక వూహమెరిసింది. వెంటనే ఒకపెట్టెలో బాలుని భద్రపరచింది. అందులో కొంతధనం కూడ వుంచింది. తీసుకుపోయి, ఆపెట్టెను అశ్వనదీప్రవాహంలో వదిలింది. తానేమి చేస్తున్నదో తనకే తెలియలేదు. పెట్టెవంకచూస్తూ నిలబడింది.

**కుంతి ఆవేదన:**

జలతరంగాలమీద తేలుతూ పెట్టె కనుచూపుమేర దాటి పయనిస్తూ వుంది. మబ్బు కొంత విచ్చిపోయింది. కుంతి దిక్కులు చూసింది. ఎవరూలేరు. బావురుమని యేడ్చింది. కడుపులోని దుఃఖమంతా వెళ్ళబోసుకుంది. 'నాచిన్నితండ్రీ! మునీశ్వరుడు నాకెందుకు మంత్ర మిచ్చాడు? తెలివిమాలి నేనెందుకు అరవిందసఖుని

ఆహ్వానించాను? అతడువచ్చి వద్దంటే సుతునెందుకు ప్రసాదించాడు? అబ్బ! సుతుడంటే సామాన్యసుతుడా!! సహజకర్ణకుండలభూషితుడు. వజ్రకవచశోభితుడు అలాంటి నాకన్నకొడుకు నాకుదక్కలేదు. అయ్యో! చేతులార నదిలో త్రోశాను. నాబంగారుకొండా! ఏవూరికి వెళుతున్నావు? ఏతల్లి ఒడిలో చేరుతావు? నిన్నుముద్దాడి పోషించే అదృష్టమేసతికి సమకూరుతుంది? ఎక్కడున్నా నీవు కనిపిస్తావులే. తళతళలాడే చెవులపోగులు, మిల మిలలాడే మైమరువు, అందాలుచిందే ఆకారమూ నీవెక్క డున్నా చేయెత్తిచూపిస్తాయి. నీ అభ్యుదయం చూచి తల్లిగా సంతోషిస్తాను. నానోము ఫలమింతే, అని వెను దిరిగి అంతిపురికి వెళ్ళింది.

**విధివిలాసం:**

ఆపెట్టె అశ్వనదిలోనుంచి చర్మణ్వతిలోకి, చర్మణ్వతి లోనుంచి యమునలోకి, యమునలోనుంచి గంగలోకి అంచెలంచెలుగా ప్రయాణించింది. అలల్లో ఉయ్యాల

లూగుతూ సాగుతూ సూతదేశంలోని చంపా పుర ప్రాంతంలో పోతూవుంది. ధృతరాష్ట్రుని సఖుడైన అతి రథుడనే సూతుడు భార్యాసమేతంగా జలక్రీడలాడుతూ పెట్టెను చూశాడు. పట్టుకొన్నాడు. అతనిభార్య రాధ పెట్టెతెరిచింది. మణికనకకాంతులతో ప్రకాశించే శిశువును ఇద్దరూ చూశారు. మనకు బిడ్డలు లేరు. భగవంతుడు మనకీ బిడ్డ నిచ్చాడు, అని యెదకు హత్తుకొన్నారు. విధివిలాస మేమో! కుంతి కన్నకొడుకు రాధేయుడయ్యాడు.

ఇది దేవతావరప్రసాద కథ. లోకానికి తెలియదు.

**కుంతీవివాహం :**

కుంతిభోజమహారాజు తన పెంపుడుకూతురు కుంతికి స్వయంవర కల్యాణం చాటించాడు. కుంతి గుణ శీలసౌందర్య విశేషాలను ఎక్కడ చూసినా లోకం శ్లాఘిస్తూవుంది. కురుకులవృద్ధులకు కుంతిని కోడలు చేసుకోవాలనే అభిలాష కలిగింది. పాండురాజు మహా

వీరుడు, తేజశ్శాలి. స్వయంవరోత్సవానికి వెళ్ళాడు. రాజ కుమారులెందరో వచ్చారు. అందరూ కుంతిని మెచ్చిన వారే. తన్ను మెచ్చి వచ్చినవారిలో తనకు నచ్చినవాణ్ణి కుంతి యెన్నుకోంటుంది. ఒక్కసారి సభవంక తేరిపార చూసింది. రాజలోకంలో పాండురాజు చుక్కల్లో చంద్రుని లాగున్నాడు. కుంతిమనస్సు అక్కడ లగ్నమయింది. పాండురాజుమెడలో పూలదండ వేసింది. ఘనంగా వివాహశుభం జరిగింది.

పాండురాజు వనవిహారం :

తరువాత, మద్రరాజకన్య మంచి అందగత్తె అని, అపూర్వ విలాసవతి అని విన్నాడు పాండురాజు. మాద్రిని పెళ్ళి చేసుకోవాలని ఉవ్విళ్లూరాడు. భీష్మాదులు అనుమతించారు. పెళ్ళి జరిగింది. కుంతికి సవతి వచ్చింది.

ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు, పెద్దవాడు; రాజు. పేరుకు రాజేగాని పరిపాలనా వ్యవహారమంతా తమ్మునిదే.

పాండురాజుకు అన్న అంటే భక్తి. దిగ్విజయం చేసి రాజ్యసంపత్తి పెంచాడు. లక్ష యేనుగులు మోసేటంత బంగారం తెచ్చి బొక్కసం నింపాడు. ఆ డబ్బుతో ధృతరాష్ట్రుడు ఎన్నో యజ్ఞాలు చేశాడు.

పాండురాజు మహా పరాక్రమశాలి అని, దాత అని పేరు ప్రసిద్ధి వచ్చింది. ప్రజలు ఎంతో అభిమానిస్తున్నారు.

భీష్మునికి, విదురునికి పాండురాజు మీద వాత్సల్యం, ప్రేమ ఎక్కువ. నాయనమ్మ సత్యవతి వుంది. తల్లులున్నారు. అందరికి పాండురాజు అంటే ప్రాణం. ఎవరికే అవసరం కలిగినా పాండురాజును పిలుస్తారు. ప్రజల్లో అంతఃపురములో కురుసభలో పాండురాజు ప్రతిష్ఠ జేగీయమానంగా వుంది.

దండయాత్రలు, రాజకీయ సమస్యలు, ప్రజల విన్నపాలు నిరంతరం వీటితోనే సరిపోతూ వుంది. తెరపి

లేదు. ముద్దు ముచ్చట తీరేదెపుడు? ఏ తంటా లేకుండా కొన్నాళ్ళు సుఖంగా కాలక్షేపం చేస్తామని సంకల్పించాడు పాండురాజు. ఊరు కంటె అడవి మేలనుకొంటే, అక్కడ ఏ యిక్కట్టు వస్తుందో యెవరికి తెలుస్తుంది? ఇద్దరు భార్యలను వెంట బెట్టుకొని వెళ్ళి మహారణ్యంలో మకాం వేశాడు.

హస్తినాపురం నుంచి అరణ్య మధ్యానికి ప్రతిరోజు తినుబండారాలతో బాటు పరిమళ ద్రవ్యాలు, అలంకార సామగ్రి సరఫరా అవుతున్నాయి. రాచనగరును మరపించే కక్ష్యాంతరాలతో కుటీరాల్లో హంసతూలికా పర్యంక డోలికల్లో ఇంద్రభోగ మనుభవిస్తూ, సరోవరాల్లో జలక్రీడ లాడుతూ కుంతి, మాద్రుల తోడిదే లోకంగా పాండురాజు కాలక్షేపం చేస్తున్నాడు.

**పాండురాజుకు మునిశాపం :**

ఒకనాడు వేటకు వెళ్ళి వనమంతా గాలిస్తున్నాడు. ఒక మృగమైనా దొరకలేదు. కోపం వచ్చింది. ఏరా!

ఒక జింకపిల్ల అయినా చిక్కదే అని తల వేడి యెక్కింది. ఒకచోట ఒక యిర్రి, ఒకలేడి రెండూ పెనుగుతూ వుండటం చూచాడు. అమ్ము వదిలాడు. రెండూ త్రుళ్లి నేల కూలాయి. రెంటిలో ఒక మృగం కొన ప్రాణంతో వుండి యిలా మాట్లాడింది. 'రాజా! నేనొక మునిని. నా పేరు కిందముడు. వినోదార్థం నేను నా భార్యా మృగాకారం ధరించి క్రీడిస్తున్నాము. మృగాలమై తిరిగే మమ్ము చంపటంలో తప్పులేదు. వేట, మృగవధ, రాజులకు ధర్మమే. కాదనను కాని, భరతవంశంలో జన్మించిన నీవు మాంసమే తిని బ్రతికే కిరాతులు పాటించే ధర్మం కూడా పాటింపక పోవటం చూసి విచారిస్తున్నాను. కిరాతకులు మృగాలను చంపుతారు. కాని పారిపోలేని వాటిని, మైమరచి పెంటితో పెనగే వాటిని, ప్రసవబాధపడేవాటిని, తెగులు సోకిన వాటిని చంపరు. నీవు సుఖపరవశులమై వుండగా మా ప్రాణాలకు తెగించావు. కాబట్టి నీవు నీ ప్రియురాలిని కూడితే చస్తావు పొమ్మని శపించి ప్రాణాలు వదిలింది. పాండురాజు నిలువునా క్రుంగి కూలబడ్డాడు.

ఆశ్రమజీవనం :

పాండురాజు పని అయిపోయింది. ఇక రాజ్యం వద్దు గిజ్యం వద్దు, మునివృత్తి అవలంబించి తపస్సు చేసుకొంటాను. కుంతీ! మాద్రీ! మీరు హస్తినాపురానికి వెళ్ళిపొండి. నేను సన్యసించానని పెద్దలందరికి చెప్పండి అన్నాడు. కుంతీ మాద్రులు మిక్కిలి దుఃఖించారు. "మేం వెళ్ళం. ఇక్కడే వుంటాం. మమ్ముల్ని విడిస్తే ప్రాణాలు విడుస్తాం" అని ఖండితంగా చెప్పారు. విధి లేక వారి సహవాసం అంగీకరించాడు. విలాస వస్తువు లన్నీ విసర్జించి ఎన్నో దాన ధర్మాలు చేసి మహామునులు నివసించే శతశృంగ పర్వతప్రాంతానికివెళ్ళి, ఆశ్రమం కట్టు కొన్నాడు. మునివృత్తితో జీవయాత్ర సాగిస్తున్నాడు.

నీకు పుత్రులు కలుగుతారు :

ఒక అమావాస్య రోజున మహర్షులంతా బ్రహ్మ సందర్శనానికి సత్యలోకం వెళుతున్నారు. మార్గం సమ్మ ర్దంగా వుంది. పాండురాజు తాను గూడా భార్యా సహి

తంగా వెళ్ళాలని యత్నించాడు. సాధ్యపడలేదు. 'అపుత్రస్య గతి ర్నాస్తి' అనే వేదవచనం జ్ఞప్తికి వచ్చి, బాధ పడ్డాడు. నాకేది దారి? అని మునివర్యుల నడిగాడు. యోగదృష్టిధనులైన మునులు 'అయ్యా! నీవు అపుత్రకుడవు కావు. దైవప్రసాదంతో నీకు పుత్రులు కలుగుతారు. ప్రయత్నించు' అన్నారు.

**నా దగ్గరొక మంత్రముంది:**

పాండురాజుకు అదే చింతపడింది. కుంతిని పిలిచి యేకాంతంలో తన మనోవ్యథ వివరించాడు. 'మా తండ్రి విచిత్రవీర్యుడు కామవ్యసనంతో ఎప్పుడో మృతి చెందాడు. మా తల్లికి ధర్మమయుడైన వ్యాసునివల్ల నేను జన్మించాను. ఇపుడు నేను బ్రతికియుండి కూడ చచ్చినవాని క్రిందేలెక్క. సంతతి కావాలంటే దేవర న్యాయమే దిక్కు. నీ చెల్లెలు శ్రుతసేన ఋత్విజుల వల్ల కొమాళ్లను గన్న విషయం నీకు తెలుసు. పుత్రులవల్ల అనంతకోటి ఫలం కలుగుతుంది. కనుక ఈ ఆచారం ధర్మసమ్మతం. నా మాట విని,

నీవు క్షేత్రజుడైన పుత్రుని నాకు సమర్పించాలి. పతి చెప్పిన పనిచేస్తే సతికి పాపం రాదు. పుత్రకాంక్షతో నీకు రెండుచేతులు జోడించి నమస్కరిస్తున్నాను.' కుంతి మెత్త బడింది. తన చిననాడు దుర్వాసుడు తన కిచ్చిన మంత్రం ప్రయోగింపవలసిన అవసరం తటస్థించింది. మహర్షి భవిష్యద్విషయం తెలిసే కాబోలు మంత్రమిచ్చాడు. కుంతి తలయెత్తి మగని మొగం చూస్తూ 'మహారాజా! భరతకుల శ్రేష్ఠుడవైన నీకు భార్యనైన నేను, ఒక మానవునివల్ల సంతానం కనడమా? నేనొప్పుకోను' అన్నది. పాండురాజు తలవంచుకొని, 'అయితే కొంప మునిగినట్లే' అన్నాడు.

కుంతి _ 'కాదు. మరొక మార్గముంది.

పాండు _ 'అదేదో చెప్పు.'

కుంతి _ 'నా దగ్గరొకమంత్రముంది. నేను పిలిస్తే దేవతలు దిగి వస్తారు.

పాండు _ 'నిజంగానా?'

కుంతి _ 'ఔను. నిజం.'

పాండు _ 'నీవెలా సంపాదించావు.'

ధర్మజుడుదయించాడు:

కుంతి ఆ ఉదంతం చెప్పింది. పాండురాజు ఆనందంతో నిలువునా పులకించిపోయాడు. ఆలస్యమెందుకు? కానిమ్మన్నాడు. కుంతి, ఏదేవుని పిలవమంటారు అన్నది. ధర్మంతోనే కదా, లోకం నిలిచింది. అన్నిటికంటె ధర్మం గొప్పది. నీవు ధర్మరాజునే ఆహ్వానించ మన్నాడు భర్త. కుంతి పతికి ప్రదక్షిణనమస్కారం చేసి, యేకాంతంగా కూర్చుని, ధర్మరాజునుద్దేశించి, దుర్వాసుడిచ్చిన మంత్రం జపించింది. సమవర్తి యోగమూర్తి ధరించి వచ్చి వరమిచ్చి వెళ్ళాడు. ధర్మప్రసాదంతో కుంతి అంతర్వత్ని అయింది. ఏడాది నిండగానే కొడుకు పుట్టాడు. ఆబిడ్డకు ఆకాశవాణి 'యుధిష్ఠిరు'డని నామకరణం చేసింది.

భీమజననం :

పాండురాజుకు ఇంకొకపుత్రుడు కావాలనిపించింది. కుంతితో అన్నాడు. 'దేవీ! అనిలదేవుని వరంతో మహాబలవంతుడైన కొడుకునొకని కను. వాడు అందరిని కాపాడ గలవాడౌతాడు' కుంతి అలాగే చేసింది. ప్రభంజనుడు ప్రత్యక్షమై వరమిచ్చాడు. కుంతికి వజ్రకాయుడైన కొడుకు కలిగాడు. వానిపేరు భీమసేనుడు.

ఇంద్రానుగ్రహమే :

తరువాత ధృతరాష్ట్రుడు గాంధారివల్ల నూరుగురు కొడుకులకన్నాడని విన్నాడు పాండురాజు. వారివల్ల తన సంతతికి అపాయంకలుగవచ్చని అనుమానించాడు. తనకు త్రిలోకవిజయుడైన కొడుకు కావాలని ఇంద్రునుద్దేశించి సంవత్సరకాలం ఘోర తపస్సు చేశాడు. ఇంద్రుడు ప్రసన్నుడై యిస్తానన్నాడు. ఇంటికివచ్చి పాండురాజు కుంతితో 'ఇంతీ! ధనం, విద్య, సంతానం ఈమూడు ఎంతలభించినా తృప్తికలుగదు. ఇంకా కావాలని ఆశ

చిగురిస్తూనే వుంటుంది. ఇంద్రుని ప్రార్థించి, ఒక పుత్రుని కను ' మన్నాడు. కుంతి సరే అన్నది. దేవతాసార్వభౌముని ఆహ్వానించింది. ఇంద్రుడు దిగివచ్చాడు. కుంతి ఆనల్లనిమూర్తిని కనురెప్పల్లో బంధించింది. పురందరుడు పుత్రుని ప్రసాదించాడు. ఇంద్రనీలమణులు రాశిపోసి ప్రాణం పోశారా అన్నట్లున్నాడు పసికందు. ఆ కర్రి వాణ్ణి అర్జునుడన్నారు.

పాండురాజుకు త్రిలోకసామ్రాజ్యం సిద్ధించినంత సంతసం కలిగింది. ముప్వరు కొమాళ్ళతో ఆడు కొంటున్నాడు.

మాద్రిమనోవ్యథ :

మాద్రి పాపం దీనురాలై చూస్తూవుంది. కుంతికి ముగ్గురు పుత్రులు పుట్టారు. అక్కడ గాంధారికి వంద మంది జన్మించారు. తనకు ఒక మొలక కూడ కలగలేదు. నిరర్థకమైన తన ఆడజన్మ గురించి ఆలోచిస్తూ, కుమిలి

పోతూ ఒకనాడు ఏకాంతం చూచి పతి సన్నిధానంలో పగులబడి యేడుస్తుంది. కుంతికి చెప్పి తనకు గూడా సంతానం కలిగేటట్లు చేయమని వేడుకొంటుంది. పాండురాజు తనకు గూడా ఈ అభిప్రాయముందని చెప్పి ఓదార్చి కుంతిని పిలిచి అశ్వినీదేవతల నాహ్వానించి మాద్రికి సంతానం ప్రసాదింపజేయమని ఆదేశిస్తాడు. కుంతి ఆపని చేసింది. మాద్రికి కవలలు జనించారు. మాద్రికి సంతానాపేక్ష మిక్కుటంగా వుంది. ఒక కొడుకుతో తృప్తి పడదు. మరొకసారి కుంతినడిగితే ఆమె యేమం టుందో ఒకేసారి దేవవైద్యుల నిద్దరిని పిలిపించి, కవలలు కలిగేలా చేశాడు పాండురాజు. ఆ బిడ్డలు నకుల, సహ దేవులు. కుంతికి ముగ్గురు, మాద్రికి ఇద్దరు వెరసి అయిదుగురయ్యారు. వీరే పంచపాండవులు.

**పాండురాజు పరలోకగమనం:**

వసంతకాలం వచ్చింది. పువ్వులు నవ్వుతున్నాయి. తుమ్మెదలు ఝంకరిస్తున్నాయి. కోయిలలు పిలుస్తు

న్నాయి. మాద్రి అటువెళ్ళింది. రాజు చూశాడు. మెల్లగా అనుసరించాడు.

కుంతి యెప్పుడూ ఏమరదు. మాద్రిని ఒక కంట చూస్తూనే వుంటుంది. ఆనాడు బ్రాహ్మణ సంతర్పణ చేయిస్తూ ఆశ్రమ ప్రాంగణంలో హాళాహాళిలో వుంది. మాద్రి లోపలే కూర్చొని వుందిలే అనుకొంది.

మాద్రి పాండురాజులిద్దరూ కొత్తగా పూచిన తీగలు పరిశీలిస్తూ విహరిస్తున్నారు. రకరకాల పూలు అలంకరించు కొని, సతి మాద్రి రతీదేవిలాగా ఒయ్యార మొలుకుతూ వుంది. విరితీవలు పీచోపులు వేస్తున్నాయి. చిన్న భార్య సింగారం రాజుకు మత్తెక్కించింది. ఆమె మెడలోని పొగడ పూదండ నాఘ్రాణిస్తూ చెక్కిలి ముద్దు పెట్టుకొన్నాడు. మాద్రి భయపడింది. కుష్ఠరోగిని చూసి మొగం వెనక్కు తిప్పుకొనే త్రాచుపాములాగా తప్పుకోడానికి చూసింది. రాజు అదిమి పట్టుకొన్నాడు. వద్దు, వద్దు అని మాద్రి వారించింది. రాజు వినిపించుకోలేదు. మదనోన్మాదం

చెలరేగింది. అంతే బాణపుదెబ్బతో త్రుళ్లి పడ్డ జింకవలె విగతజీవుడై పడిపోయాడు పాండురాజు.

**మాద్రి సహగమనం:**

పతిని పట్టుకొని బోరుమని యేడుస్తూ వుంది మాద్రి. ఆ ఆక్రందనధ్వని విని కుంతి పరుగెత్తి వచ్చింది. కొడుకులు వచ్చారు. శతశృంగ నివాసులైన మునులు వచ్చారు. శాపఫలం పొందిన రాజును చూచి, అందరు శోకిస్తున్నారు. కుంతి ముందుకు వచ్చి మాద్రిని ప్రక్కకు లాగి 'నేను పతి వెంటనే పోతాను. నీవు బిడ్డలను పోషిస్తూవుండు అన్నది'. మాద్రి కుంతిని వెనక్కుత్రోసి 'నేనే పతివెంట వెళతాను. నీవు మహారాజును స్వయం వరంలోచేపట్టావు. వంశంనిలిపావు. పుణ్యగతి కల్పించావు. అభీష్టం తీర్చావు. నేను కోర్కె తీర్చలేక పోయాను. శాప విషయం తెలిసికూడ ఏమరుపాటున చేటు తెచ్చిన పనికిమాలినదానను. ఇలాంటి నేను పుత్రులను సంరక్షింప గలనా? వద్దు నన్ను వెళ్ళనీ. అన్యలోకంలో అయినా

పతికి ప్రీతికలిగించడానికి ప్రయత్నిస్తాను. అక్కా! నీవే బిడ్డల రక్షించాలి' అని దీనంగా వీడుకోలు పలికి, మునీశ్వరులకు మ్రొక్కి చితి యెక్కి పతితో బాటు అగ్ని శిఖల్లో లీనమై పోయింది.

సతీసహగమన మనేది విధి కాదు. ఐచ్ఛికం. ఇష్టమున్న వాళ్లు చితి యెక్కవచ్చు. లేని వాళ్లు మానుకోవచ్చు.

శతశృంగవాసులు కుంతిని ఊరడించి, పాండుకుమారుల సముదాయించి, అందరిని హస్తినాపురానికి తోడ్కొని వచ్చి, కురువృద్ధులకు అప్పగించి వెళ్లారు.

కుంతి విధవ అయింది. బిడ్డలు నేదరులు. కనుక రక్షణభారం విద్యాశిక్షణభారం రెండూ తానే వహింపవలసి వచ్చింది.

**కౌరవ - పాండవ విద్యాభ్యాసం :**

గాంధారేయులు, కౌంతేయులు కలిసి విద్యాభ్యాసం చేశారు. దుర్యోధన దుశ్శాసనాదులు గాంధారేయులు.

యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవులు కౌంతేయులు. నకుల సహదేవులు మాద్రేయులయినా కౌంతేయుల క్రిందనే లెక్క. సంరక్షకురాలు కుంతీదేవి కనుక.

ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు విద్యాగురువులు. ద్రోణునకు కౌంతేయుడైన అర్జునునిపట్ల వాత్సల్యమెక్కువై విశేషాస్త్రాలెన్నో అనుగ్రహించాడు. కౌరవ పాండవ కుమారులే కాక, మరెందరో చుట్టుపట్ల నుండే రాజకుమారులు వచ్చి, హస్తినాపురంలోని అథర్వణ కళాశాలలో విద్య నభ్యసించారు. పిల్లలు ఎదిగారు. సమస్త విద్యల్లో కాకలు తీరారు.

కుమార విద్యా ప్రదర్శనం :

ఒకనాడు కుమారాస్త్ర విద్యా ప్రదర్శనోత్సవం జరిగింది. మహారాజు, గాంధారి ముందటి వరుసలో కూర్చున్నారు. గాంధారి ప్రక్కనే కుంతీదేవి కూర్చున్నది. వ్యాసాది భూసురులు విచ్చేశారు. భీష్ముడు, విదురుడు,

శల్యుడు, శకుని, సోమదత్తుడు మున్నగువారు, కురు వృద్ధులు బంధుమిత్రులు సభనలంకరించారు. రంగస్థలం రమణీయంగా అలంకరింపబడింది.

రాకుమారులందరు తమ తమ ధనుర్విద్యా పాండిత్యం ప్రదర్శిస్తున్నారు. అర్జునుని వంతు వచ్చింది. నల్లనివాడు. పద్మనయనములవాడు, ఇనుపకవచం తొడుక్కొని కరికలభం లాగున్నాడు. అతని హస్తలాఘవం, అతని చిత్ర విచిత్ర బాణ ప్రయోగ చాతుర్యం, ఒక బాణం వేసి వాన కురిపించటం, ఒక బాణం వేసి గాలి పుట్టించటం, ఒక బాణం వేసి అగ్నిజ్వాలలు రేపటం చూస్తూ సభ చప్పట్లు గొట్టి ప్రశంసిస్తూ వుంది. అప్పుడు కుంతీదేవి తనలో తాను ఎన్నో ఆశలు త్రవ్వుకొంటూ పారవశ్యం పొందుతూ వుంది. 'ఈ కాలంలో అర్జునుని మించిన విలుకాడు లేడు' అనే అభినందన వాక్యాలు ఆకాశంనిండుతున్నాయి.

ఎవరో సభలో ప్రవేశించారు:

ఆ తరుణంలో కొండమీద పిడుగుపడ్డట్లు ఒక భయంకరధ్వని వచ్చింది. అందరు రంగద్వారంవైపు చూచారు. ఎవడో ప్రవేశద్వారం దగ్గర నిల్చి మల్లచరిచాడు. వాడు భుజబలం ప్రదర్శించటానికి వచ్చాడని తెలిసింది. పాండవులు ద్రోణుని అండజేరారు. కౌరవులు దుర్యోధనుని అండజేరారు. ఉన్నత విగ్రహం, పసిడి మైచాయ, చెవుల్లో ధగధగ మెరిసే పోగులు, రత్నకవచం, మహాతేజశ్శాలి యెవడో దూసుక వస్తున్నాడు. వాని చేతిలో పెద్దధనుస్సు వుంది. నరాసరి సభలోకి వచ్చాడు. కృపాచార్యులకు ద్రోణాచార్యులకు నమస్కరించాడు. అర్జునుని వైపు తిరిగి యిలా అన్నాడు. 'ఈ విద్యలు మాకూ తెలుసు. మేమూ చూపగలం. నీ వొక్కనివే నేర్పరివనుకోకు.' ద్రోణాచార్యుడనుమతించాడు. అతడు తన నేర్పు ప్రదర్శిస్తున్నాడు. అర్జునుడు చూపిన విద్యలన్నీ అనాయాసంగా చూపుతున్నాడు. ఇంకా ఎన్నో అద్భుతాలు చూపుతున్నాడు. అర్జునునితో ద్వంద్వయుద్ధంచేస్తానంటున్నాడు.

ఔను, వీడు నా కొడుకే:

కుంతి మనస్సు పట్టుకోలేక పోతూ వుంది, వాడెవడో కాదు. తాను కని వరదలో పారవేసిన బాలుడే. వాడు తన కొడుకు. తన తమ్మునితోనే ఘర్షణ పడు తున్నాడు. పరిస్థితి విషమిస్తూ వుంది. తాను లేచి వెళ్ళి కౌగిలించుకొని వీడు నా ప్రథమపుత్రుడని ప్రకటిస్తే. ఆరుగురు బిడ్డలు కలిసి బ్రతుకుతారు. ఉపేక్షిస్తే చేయి దాటిపోతుంది.

ఇంతలో కారుమేఘాలు వ్యాపించాయి. మబ్బు క్రమ్మింది. కుంతి మూర్ఛిల్లింది.

కర్ణుడు అంగరాజైనాడు:

అర్జునుడు ఆ క్రొత్త వ్యక్తితో వాగ్యుద్ధానికి దిగాడు. 'నీవు పిలువని పేరంటానికి వచ్చి అధిక ప్రసంగం చేస్తున్నావు. ఎవడవు? వెళ్ళిపో!, అన్నాడు. కృపాచార్యు లందుకొన్నాడు. 'ఓయి కొత్తబ్బాయి! నీ అంతస్తు తెలిసి

కోకుండ నీవు వ్యవహరిస్తున్నావు. అర్జునుడు రాజపుత్రుడు. రాజపుత్రులతో ద్వంద్వయుద్ధం చేసే అర్హత రాజపుత్రులకే వుంటుంది. మీ నాయన రాజా? నీవు రాజువా?' అని అడిగే సరికి బదులు చెప్పలేక పోయాడు. తల వంచుకొన్నాడు. అప్పుడు దుర్యోధనుడు ముందుకు వచ్చాడు. అర్జుననితో తలపడగల వీరునికోసమే చూస్తున్నాడు కనుక అప్పటికప్పుడే తండ్రితో చెప్పి, అంగరాజ్య మిప్పించి అక్కడికక్కడే పట్టాభిషేకం చేయించి, అతనికి రాజ లాంఛనాలు కల్పించి 'రాజు' అనిపిస్తాడు. స్వశక్తిచే పైకి వచ్చిన ఆ వ్యక్తియే కర్ణుడు.

కర్ణుడు దుర్యోధనునికి స్నేహ హస్త మందిస్తాడు. కుంతి చూస్తూ వుండగానే కర్ణుడు ప్రతిపక్షంలో చేరాడు.

కుంతి నిస్సహాయురాలై నిట్టూర్పు విడిచింది.

**లక్క ఇంటిలో పాండవులు:**

పాండవులకు కౌరవులకు పడలేదు. పచ్చిగడ్డి వేస్తే భగ్గుమని మండుతుంది. ధృతరాష్ట్రునికి గూడ మన

సులో కష్టంగానే వుంది. ఒకనాడు దుర్యోధనుడు తన మనోదుఃఖం తండ్రికి వెల్లడిస్తాడు. పాండవ ప్రాబల్యం పెరగకుండా నిరోధించే ఉపాయం చూడమంటాడు. కుంతితో బాటు పాండవులను కొంతకాలం దూరంగా వుంచటం శ్రేయస్కరమని చెపుతాడు. తండ్రి అనుమతితో పాండవనివాసం వారణావతమనే పట్టణానికి మార్పిస్తాడు. తల్లీ కొడుకులు నూతన గృహప్రవేశం చేశారు. అక్కడ వారి కోసం కొత్తగా భవనం కట్టించి పెట్టారు. ఇంటిగోడలు మిన మిన మెరుస్తూ వుంటాయి. భీమునికి అనుమానం కలిగి గిల్లి చూస్తాడు. ఇల్లంతా లక్కతో నిర్మించారు. నిప్పు చూపితే భగ భగ మండిపోతుంది. "సోదరులారా! అగ్నిభయముంది; జాగ్రత్త" అన్నాడు. విదురుడు పాండవ పక్షపాతి. దుర్యోధనుని ద్రోహచింత అతనికి తెలిసింది. అయ్యో! అన్యాయంగా పాండవులు బూడిదై పోతారే అని జాలిపడి, "పలానారోజు లక్కయింటికి అగ్గిపెడతారు. మీరు ఆ రాత్రి తప్పించుకోవలసింది" అని రహస్యంగా

వార్త పంపిస్తాడు. అంతేకాకుండా ఒక సొరంగం త్రవ్వించి లక్క యింట్లోనుంచి బయటపడటానికి మార్గం కల్పిస్తాడు. పాండవులు జాగ్రత్తపడ్డారు.

సురక్షిత ప్రదేశానికి :

కుంతీదేవిని సేవిస్తూ వారణావతంలో ఒక బోయత వుండేది. ఆమె దుర్యోధనుని గూఢచారిణి. ఇక్కడి సంగతులు అక్కడికి చేరవేస్తూ వుండేది. శిల్పాచార్యుడు పురోచనుడనేవాడు కూడ ఆ ప్రాంతంలోనే వున్నాడు. తన ప్రభువు ఆజ్ఞ చొప్పున కృష్ణచతుర్దశినాడు, అర్ధరాత్రి మీరిన తర్వాత లక్కయింటిని తగులబెట్టడానికి సిద్ధంగా వున్నాడు. కృష్ణచతుర్దశి వచ్చింది. కుంతీదేవి ఆరోజు ఊరిలోవుండే యిల్లాండ్ర కంతా అన్నదానసంతర్పణ జరిపింది. గూఢచారిణి బోయతకు అయిదుగురు కొడుకులున్నారు. తల్లీ కొడుకులు సుష్టుగా భోంచేసి, తప్పతాగి, ఆనాడు అక్కడే లక్కయింటి పంచన పడుకొని నిద్ర పోయారు. అర్ధరాత్రివేళ భీముడు లేచాడు. శిల్పా

చార్యుని యింటికి ముందుగా నిప్పుపెట్టాడు. కుంతిని, ధర్మజార్జునులను సొరంగంలోనికి పంపించి, లక్కయింటికి నిప్పుపెట్టాడు. సొరంగందారిగుండా తాను తనవారు సురక్షితంగా నిర్గమించారు.

ఘటోత్కచుడు పుట్టాడు:

నిద్రలేక, వడిగా నడవలేక తల్లి తూలుతూవుంది. సహోదరులు కూడ అలసిపోయారు. అది తెలిసి భీముడు తల్లిని, సోదరులను ఎత్తుకొన్నాడు. తల్లి మెడమీద కూర్చుంది. ధర్మజార్జునులు చెరొక భుజంమీద కూర్చున్నారు. నకుల సహదేవులు చంకల్లో ఇరుక్కున్నారు. భీముడు అయిదుగురిని మోసుకొని, పవన వేగంతో నడచి, గంగదాటి, దుర్గమారణ్యం గుండా ప్రయాణించాడు. సాయంకాలమైంది. ఒక మర్రిచెట్టుక్రింద విశ్రమించారు. అప్రక్క ఒక కుంట వుంది. నీళ్ళుత్రాగివచ్చి కూర్చున్నాడు. అందరూ నిద్రపోతున్నారు. భీముడు కూర్చొని ఆలోచిస్తున్నాడు. హిడింబ అనే రాక్షసి వచ్చింది. ప్రేమించింది.

భీముడు తొణకలేదు. ఇంతలో హిడింబుడు గర్జిస్తూ వచ్చాడు. భీముడు వాణ్ణి పట్టుకొని చీల్చి ప్రోవు పెట్టాడు. హిడింబ భీముని వెంబడించింది – పెండ్లిచేసికొమ్మని. రాక్షసులు నమ్మదగ్గవారుకారు. నిన్నుగూడ చంపేస్తాను. పొమ్మంటాడు భీముడు. హిడింబ కుంతీదేవి శరణు వేడింది. కుంతి జాలిపడి, హిడింబను చేపట్టుమని చెపుతుంది. తల్లి ఆజ్ఞ పాటించి భీముడు హిడింబను భార్యగా స్వీకరిస్తాడు. హిడింబాభీమసేనుల వివాహఫలమే ఘటోత్కచుడు.

**పాండవులకు పరలోకక్రియలు :**

వారణావతంలో లక్కయిల్లు కాలిపోయిందని, అందులో ఒక స్త్రీ అయిదుగురు పురుషులు దగ్ధులయ్యారని వార్త హస్తినాపురానికి వెళ్ళింది. అయ్యో! కుంతీ సహితంగా పాండవులు మసి అయిపొయ్యారని ధృతరాష్ట్రుడు చాలా దుఃఖించి, వారికి పరలోకక్రియలు ఘనంగా చేయించాడు. దుర్యోధనుడు పీడ విరగడైపోయిందని సంతోషించాడు.

**నేను మాటఇచ్చాను:**

పాండవులు క్రమంగా ప్రయాణిస్తూ ఏకచక్రపుర మనే అగ్రహారం చేరుకొన్నారు. అక్కడ ఒక బ్రాహ్మణుల యింటి పంచలో దిగారు. వైదికవృత్తితో కాలక్షేపం చేస్తున్నారు. ఒకనాడు కుంతి భీముడు ఇద్దరే విడిదిలో వున్నారు. తక్కినవారు భిక్షానికి వెళ్ళారు. ఒక్క పెట్టున ఆ యింటి వారంతా గొల్లుమన్నారు. "పాపం వీరికేమి కష్టంవచ్చిందో? మనకు ఆశ్రయమిచ్చారు. మంచివారు. వీరికి మనం ఏదైనా ప్రత్యుపకారం చేయాలనుకొంటూ వుండేదాన్ని. ఈ సమయంలో మనం వారినాదు కోవాలి." అని కుంతి చెప్పింది. "తప్పకుండా చేస్తాం. వెళ్ళి విషయమేమిటో కనుక్కొని రమ్మ"న్నాడు భీముడు. కుంతి వెళ్ళివచ్చింది. "నాయనా! భీమసేనా! నేను వారికి మాటయిచ్చాను; నీవు నెరవేర్చాలి. ఇక్కడ యమునా నది గట్టుమీద బకుడనే రక్కసుడున్నాడు. వాడు ఊరి మీదబడి ప్రజనుమారి మసగినట్లు తినివేసేవాడట. ఒక

నాడు ఊరిపెద్దలంతా సభచేసి ఒక కట్టడి చేసుకొన్నారట. రాక్షసుడు ఊరిమీదికి రాకూడదు. అక్కడే వుండాలి. ప్రతిదినం ఊరి యింటి వరుస ప్రకారం ఒకమనిషి, రెండు దున్నపోతులుకట్టిన బండినిండ అన్నము పంపిస్తూ వుంటాము అని. రాక్షసుడు బండెడు కూడు, రెండు దున్నలు, ఒక మనిషి - మొత్తం స్వాహా చేస్తాడట. ఈ దినం మనయింటి బ్రాహ్మణుని వంతు వచ్చింది. బకునికి ఆహారంగా నేను పోతానని గృహస్థు, వద్దు నేనేపోతానని అతని యిల్లాలు, మీరిద్దరు వద్దు. ఎప్పుడైనా యిల్లుదాటి వెళ్ళేదాన్నేకదా నేను పోతానని కూతురు, ఒకళ్ళొకళ్ళు కౌగిలించుకొంటూ ఏడుస్తున్నారు. నేను మాట యిచ్చాను. నాకొడుకును పంపుతానని. ఇదీ సంగతి."

నేనంత బుద్ధిలేని దాన్ని గాను :

అంతా విని భీముడు 'ఇంతేనా? నేను పోతాను. నాకు కడుపు నిండ అన్నం పెట్టించు' అన్నాడు. ఉల్లాసంగా వున్నాడు. ఇంతలో భిక్షానికి వెళ్ళిన సోదరులు

వచ్చారు. భీముని వాలకం చూచేసరికి ధర్మరాజుకు అను మానం కలిగింది. వీడెవరితోనో పోట్లాటకు తయారై నాడే అని తల్లి నడిగాడు. సంగతి తెలిసికొన్నాడు. "అమ్మా! నీకు వెర్రా? పిచ్చా? భీముడు నీకు బరు వయ్యాడా? తల్లికి నలుగురు కొడుకు లుంటే దురదృష్ట వశాత్తు వారిలో ఒకడు కుంటో గ్రుడ్డో అయితే తల్లి వాన్ని గూడ ప్రేమిస్తుందే కాని, అవిటివాడని పోగొట్టు కోవ డానికి అంగీకరించదు. నీవు భీముని రక్కసునికి ఆహా రంగా ఇస్తావా?" అని ఆక్రోశించాడు. భీముడు నవ్వాడు. తల్లి కూడ నవ్వుతూ, "మన భీమసేనుడు ఆ యేటి గట్టున వుండే బకానికి లోకువని భావిస్తున్నావా? నేనంత బుద్ధి లేని దాన్ని కాను. వీడు వజ్ర శరీరుడు. వీడు పుట్టిన పదవరోజున నా చేతిలోనుంచి జారి క్రిందపడ్డాడు. అది కఠినశిలా ప్రదేశం. వీని కేమైనా దెబ్బ తగిలిందేమో అని భయపడ్డాను. తీరా చూస్తే, వీని శరీరభారానికి కొండ రాయి నుగ్గయిపోయింది. వీడు అంత గట్టివాడు. మనకు

నిలువ నీడ యిచ్చిన యీ కుటుంబానికే కాదు, ఈ ప్రదేశానికే రాక్షస బాధ లేకుండా చేయాలని నా ఉద్దేశం. మీరేమీ భయపడవద్దు" అని సమాధాన పరిచింది. భీముడు బకుని వధించాడు.

**పాంచాల దేశానికి ప్రయాణం :**

పాంచాలపతి ద్రౌపదీ స్వయంవరోత్సవం చాటించాడు. నానాదేశాధీశులైన రాజపుత్రులు ద్రుపద రాజధానికి వెళుతున్నారు. బ్రాహ్మణులు గుంపులు గుంపులుగా బయలుదేరారు. కుంతీదేవి కొడుకులతో అన్నది-'నాయనలారా! మన మిక్కడకు వచ్చి చాల నాళ్లయింది. ఒకే చోట పాదుకొని వుండటం దేనికి? వెళదాం. దక్షిణ పాంచాల దేశం సుభిక్షంగా వుందని, అక్కడి ప్రజలు బ్రాహ్మణులకు ఆప్యాయంగా లడ్డు, పాలు, పెరుగు, భోజనం పెట్టి సత్కరిస్తారని వింటున్నాము' అని. వారికి ముందే వెళ్లాలని అభిప్రాయముంది. తల్లి హెచ్చరించే సరికి మూపులు మూడయ్యాయి. బయలుదేరారు. ద్రుపద

పురం చేరుకొన్నారు. ఊరంతా కిట కిట లాడుతూవుంది. ఎక్కడ చూసినా పెద్ద పెద్ద గుడారాలు, రాజభటులు, రథాలు — ఒకే సందడి. తమకు విడిది యెక్కడ దొరుకుతుంది? ఒక కుమ్మరసెట్టి యింట్లోదిగారు. మృగచర్మాలు, నారచీరలు, విభూతి పట్టెలు, వేదఘోష — అచ్చంగా బ్రాహ్మణమూర్తులై నివురు గప్పిన నిప్పుల్లా వున్నారు. తల్లి విడిదిలోనే వుంది. కొడుకు లైదుగురు స్వయంవర సభకు వెళ్లారు.

ద్రౌపదీ స్వయంవరం :

ద్రౌపది కలువ పూవువంటి నల్లనిమూర్తి. త్రిలోక సుందరి. తెల్లని పూలదండ చేత బట్టుకొని మన్మథుని ఆరవ బాణం లాగా నిలుచుంది. రాజలోకమంతా మూగి వున్నారు. మంగళవాద్యిత్ర ధ్వనులు, రకరకాల జనుల సందడి సముద్రపు ఘోషను అనుకరిస్తున్నాయి. ద్రౌపది సోదరుడు దుష్టద్యుమ్నుడు ముందుకువచ్చాడు. చెయ్యెత్తి నిశ్శబ్దంగా వుండమని కోరాడు. అక్కడ గంధ పుష్ప

దీపార్చితమైన పెద్ద విల్లు, అమ్ములు, ఆకాశంలో నిలిపిన కనకమత్స్యయంత్రమూ చూపాడు. ఈ కార్ముకము నెక్కుపెట్టి, అయిదు బాణాలతో ఆ లక్ష్యాన్ని ఎవరు భేది స్తారో వారిని ఈ కన్య వరిస్తుంది అని ప్రకటించాడు. ఉత్సాహవంతులైన రాజపుత్రు లందరు ప్రయత్నించారు సాధ్యపడలేదు. ఇక క్షత్రియవీరుల్లో ముందుకు వచ్చే వారెవరూ కనిపించలేదు. అప్పుడు బ్రాహ్మణ్యంలో నుంచి బ్రాహ్మణ వేషధారి అర్జునుడు ముందుకు వచ్చాడు. విల్లు తీసుకొన్నాడు. లక్ష్యం భేదించాడు. ద్రౌపది అతనికి పూలదండ వేసింది.

**అయిదుగురు పంచుకోండి :**

బ్రాహ్మణులంతా ఉబ్బిపోయి నాట్యం చేశారు. క్షత్రియులకు తలగొట్టి నట్లయింది. కడుపుమంటతో కౌరవులు గలాటా చేశారు. కృష్ణ బలరాములు వినోదం చూస్తూ కూర్చున్నారు. సద్దు మణగిన తరువాత భీమార్జు నులు ద్రౌపదిని తోడ్కొని విడిదికివెళ్లారు. అంతకు ముందే

ధర్మజుడు, నకుల సహదేవులు వెళ్లారు. గాండీవి ఉత్సాహంతో పొంగిపోతూ 'అమ్మా! భిక్ష తెచ్చా' నన్నాడు. పెండ్లికూతురు వెనుకవుంది. కుంతి తలయెత్తి చూడకుండా ఎప్పటిలాగే 'అయిదుగురు పంచుకోండి నాయనా!' అన్నది. తీరా చూస్తే భిక్ష కాదు. మృగాక్షి. కుంతీదేవి నాలుక కొరుక్కొని 'అయ్యో! నాయనా! యెంత మాటన్నాను!! భిక్ష అంటే భిక్షే అనుకొన్నాను. నా మాట మీ రెన్నడూ జవదాటి యెరుగరు. ఇపుడేది మార్గం? అని విచారించింది.

ముందే వ్రాసి పెట్టాడు :

ద్రౌపది రంగు నలుపే అయినా, రూపు శచీదేవికి పైచేయిగా వుంది. ఆ కన్యను చూస్తూ వుంటే పాండవులయిదుగురికీ అభిలాష కలుగుతూ వుంది. భీముడు హిడింబను స్వీకరించేటప్పుడు తక్కిన నలుగురూ చూశారు కదా, ఎవరికీ అటువైపు మనస్సు పోలేదు. ఇప్పటి పరిస్థితి తద్భిన్నంగా వుంది. ధర్మరాజు ఈ రహస్యం గ్రహించాడు.

కుంతితో అన్నాడు – 'అమ్మా! నీ మాట మేమెపుడూ కాదన లేదు, ఇపుడూ కాదనం. ద్రౌపదిని మేము అయిదుగురము పెండ్లాడుతాము. చిక్కు విడిపోయింది. కాని ద్రుపదుడు ముక్కు నల్చుకొన్నాడు. ఇదెక్కడి న్యాయమన్నాడు. అంతలో వేదవ్యాసులవారు దయచేశారు. ద్రౌపది పుట్టు పూర్వోత్తరాలు వివరించి, "యీ కన్యకు భర్త లయిదుగు రని బ్రహ్మ ముందే వ్రాసిపెట్టాడు. తప్పులేదు కానివ్వండి" అని సెలవిచ్చారు. పెండ్లి జరిగింది.

కుంతి నోటి వెంట ఒకమాట వస్తే అది జరిగితీర వలసిందే.

పాండవులకు అర్ధరాజ్యం:

పాండవులు ద్రుపదపురంలో ఇష్టోపభోగాలు అను భవిస్తూ వున్నారు. ఈ శుభవార్త హస్తినాపురం చేరింది. పాండవులు బ్రతికి బయటబడటమే కాక, చుట్టాలప్రాపు సంపాదించుకొన్నారు. దుర్యోధనునికి నడుములు విరిగినై. తిరిగి కౌంతేయులకు చెరుపు చెయాలని చూచాడు.

భీష్ముడు విదురుడు అతని ఆట సాగనీయలేదు. వారు ధృతరాష్ట్రునికి బుద్ధి చెప్పారు. ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్యమిస్తానంటాడు. విదురుడు ద్రుపద రాజధానికి వెళ్ళి పాండవులను పిల్చుకొని వస్తాడు. అన్నట్టు ధృత రాష్ట్రుడు రాజ్యమిస్తాడు. పాండవులు ఇంద్రప్రస్థపురం నిర్మించుకొని దిగ్విజయంచేసి రాజసూయయాగం నిర్వ హిస్తారు. కన్నుకుట్టి దుర్యోధనుడు ఏడుస్తాడు.

పుత్రుని పట్టాభిషేక మహోత్సవం చూచింది.

రాజసూయ యాగ వైభవం చూచింది.

ధన్యురాల ననుకొంది కుంతి. కాని, అచిరకాలం లోనే విధివక్రించింది. శకుని మాయాద్యూతంలో పాండవ సంపద నపహరించి, దుర్యోధనుని కిచ్చాడు. కుంతి చెప్ప రానంతవంత అనుభవించింది.

**కుంతీ** సందర్శనం :

పాండవులు జూదంలో ఓడి అడవుల పాలైనపుడు కుంతి హస్తినాపురంలోనే వుంది. పాండవులు పన్నెండేండ్లు

అరణ్యవాసమూ, ఒక యేడు అజ్ఞాతవాసమూ పూర్తిచేసి బయటుపడ్డారు. తమను ఒకకంట చూడమని గుడ్డిరాజుకు విన్నవించుకొన్నారు. లాభం లేకపోయింది. యుద్ధానికి సిద్ధపడుతూ ఎందుకైనా మంచిదని, శ్రీకృష్ణుని రాయబారిగా హస్తినాపురానికి పంపించారు. రాయబారం విఫలమైంది. శ్రీకృష్ణుడు తిరిగి వెళుతూ, కుంతీదేవి గృహద్వారము దగ్గఱ బండి నిలిపి లోపలికి బోయి ఆమెను దర్శించాడు. సపరివారంగా ధృతరాష్ట్రుడూ అక్కడకు వచ్చాడు. శ్రీకృష్ణుడు కుంతీదేవి పాదపద్మాలకు మ్రొక్కి కౌరవసభలో జరిగిన కథ అంతా చెప్పాడు. "నేను తిరిగి వెళుతున్నాను. కొడుకులకు నీవేమి సందేశ మిస్తావో యిమ్మ"ంటాడు.

సంకోచం లేని సందేశం:

ఇన్నాళ్లు దాయాదుల పంచలో పడివుండి, పల్లెత్తి ఒకమాట అనకుండా వున్న కుంతి, ధృతరాష్ట్రుడు మొద

లైన పెద్దలున్నారని సంకోచింపకుండ పరమకఠినంగ
మాటాడింది. 'అయ్యా! కృష్ణా! నేనొకే మాటచెప్తాను
రాజులకు పరాక్రమ జీవనవృత్తి వంశధర్మం. అడుక్కొ
తినటం తప్పు. పూర్వభూపతులు ముచికుందుడు, నృ
యుడు మున్నగువారు ఎలా బ్రదికారో యుధిష్ఠిరుడ
విని వుంటాడు. నీవు నడిపిన రాయబారం బాగానేవుంది
పాండవులకు కౌరవులకు పొత్తు కుదరదు. సంధి చె
పోవడం మంచికే జరిగింది. కొలువులో కొప్పుపట్టి యీడ్చి
యిల్లాలి నవమానించిన విషయం నా కొడుకుల
మరచారా? ఆనాడు సభలో చేయి చేసుకోవడాని
వీల్లేకపోయింది. ఇప్పుడేమయింది? కీర్తిలేని బ్రత
కెందుకు? పౌరుషంతో బ్రతకండి అని చెప్తాను. ఇం
కంటె చెప్పలేను.' అని కౌగిలించికొనింది. శ్రీకృష్ణుడ
నమస్కరించాడు. కుంతి దీవించింది.

ఆ సమయంలో కుంతి మాటలు విని ధృతరాష్ట్రుడ
ఆశ్చర్యపోయాడు. చస్తిమి గదరా అనుకొన్నాడు.

కృష్ణుడు వెళ్లాడు. యుద్ధం తప్పదని ధ్రువపడింది. అందరి సమక్షంలో తెంపుగా మాట్లాడిందే కాని, కుంతి తరువాత మనస్సును నిలద్రొక్కుకోలేక పోయింది.

ఇటు పాండవులకు అపాయమైనా, అటు కర్ణునికి అపాయమైనా ఓర్చుకోలేదు. చివరకొక తెంపు చేసింది.

**నీవు నా పుత్రుడవే:**

అనుష్ఠానం కొరకు కర్ణుడు గంగకు వెళ్ళిన సమయంలో రహస్యంగా తాను వెళ్ళింది. కర్ణుడు జపం చేసుకొంటున్నాడు. నిశ్శబ్దంగా వెనుక వైపున కూర్చొని వేచి వుండింది. కర్ణుడు లేచి, కుంతీదేవిని చూచి, సంభ్రమ వినయాలతో సూతగోత్రం రాధేయనామం చెప్పి, అభివాదంచేసి, 'నేను చేయగల పనియెదో ఆనతి'మ్మన్నాడు. కుంతి అన్నది _ 'నీవు రాధేయుడవు కావు. నీది సూత కులం కాదు. నీవు నా పుత్రుడవు. నిన్ను నేను కన్నాను. అపుడు నా పెళ్ళి కాలేదు. మా కుంతిభోజుని యింట్లో

వున్నాను. దుర్వాసుడు నాకు మంత్ర మనుగ్రహించాడు. మంత్రశక్తి కనుక్కుందామని సూర్యుని పిలిచాను. సూర్యుడు వచ్చి పుత్రునిచ్చాడు. కన్యనైవుండి కన్నాను. కనుక లోకానికి వెరచి, నిన్ను పెట్టెలో పెట్టి గంగలో విడిచాను. పెట్టె సూతునికి చిక్కింది. నీవు దుర్యోధనుని బంటు వయ్యావు. నీ అభిజాత్యం తెలిసికో! దాస్యం నీకు తగదు. యుధిష్ఠిరాదులు నీ కన్న చిన్నవారు. నీవు వస్తే గౌరవిస్తారు. రాజ్యం నీదే అవుతుంది. నా మాట విని రా!'

కుంతి ఆ మాట లనగానే సూర్యబింబం నుంచి ఒక ధ్వని వినబడింది. 'ఇది నిజం. కుంతి మాట విను. నీవు బాగుపడతావు' అని.

నీ వాగ్దానం గుర్తు పెట్టుకో:

కాని కర్ణుడు చలించలేదు. 'తల్లీ! నీవు చెప్పింది నిజమేకావచ్చు కాని, నన్ను క్షత్రియ సంస్కారపాత్రంగా

దిద్దినదానవుకావు. నేను రాధేయుడననే ప్రతీతి పొందాను. ఇపుడు నా పుత్రత్వంవల్ల ఫలం నీవు ఆశించడంలో అర్థం లేదు. సూర్యానుగ్రహంతో నా జన్మానికి అపవిత్రత రాదను కొన్నా, అది చాలా గోప్యంగా వుండిపోయింది. దీన్ని బహిరంగపరచడంవల్ల మనకేమీ ప్రయోజనం కలుగదు. అర్జునుని పేరుప్రతిష్ఠ ఇప్పటికే లోక ప్రసిద్ధమై వున్నాయి. ఇపుడు నేను కౌంతేయుడనని అతని సరస జేరితే భయపడి యీ అవతార మెత్తాడని లోకం గేలి చేస్తుంది. నమ్మదు కూడ. అది అలా వుండనీ ఊరు పేరు లేని నన్నింతవాణ్ణి చేసినవాడు సుయోధనుడు. నన్ను నమ్ముకొని వున్నాడు. యుద్ధ సమయంలో అతన్ని నట్టేట ముంచి వెళ్ళడం న్యాయంకాదు. కౌరవుల ఉప్పు తిన్న వారందరు నిలబడి ప్రాణా లర్పించవలసిన సమయమిది. కర్ణుడు కృతఘ్నుడు కాడమ్మా! కృతజ్ఞుడు. నీవేమైన చెప్పు. నా స్వామి సుయోధనుడు. అదే పనిగా నీ వింత దూరం వచ్చావు. కడుపు తీపితో మాట్లాడుతున్నావు. కనుక ఒక వర మిస్తు

న్నాను. అర్జునుడొక్కడే నా విరోధి. తక్కిన పాండవులు నా చేత చిక్కినను నేను వాళ్ళను చంపను. అర్జునుని వద లను. ఒకవేళ నేనే అర్జునుని చేతిలో చచ్చానా, అది నాకు కీర్తికరమే. ఏది ఏమైనా, నీ కొడుకులు అయిదుగురే. ఆరుగురనే మాట మరచిపో.' అని ముట్టజెప్పాడు. కుంతి మరి మాట్లాడలేక పోయింది. 'సరే అర్జునుణ్ణి రక్షించమని నిన్నడుగను. తక్కిన నలుగురి గురించి నీవు చేసిన వాగ్దానం జ్ఞప్తి పెట్టుకో. ఇక నేను వస్తా' అని కర్ణుని కౌగిలించుకొనింది. కర్ణుడు 'అలాగేనమ్మా' అని వంగి తల్లి పాదాలు స్పృశించాడు. కుంతి యింటికి వెళ్ళింది.

ఈ సంఘటనతో కర్ణుని బలం తగ్గిందనే చెప్పాలి. తుములసమరంలో బాహాబాహి పోరాడే సమయంలో పాండవులు తారసపడినపుడెల్ల వారు తన తోబుట్టువులనే భావం హృదయాంతరాంతరంలో పొడసూపి, వాడి_వేడి తగ్గిస్తూ వుంటుంది. యుధిష్ఠిర భీమసేన నకుల సహదేవుల్లో ఎవరైనా తనమీదికి దూసుకవస్తే, తల్లి కిచ్చిన

అభయప్రదానం గుర్తుంచుకొని, వారితో చాలా జాగ్రత్తగా యుద్ధం చేయాలి. వారి ప్రాణాలకు ముప్పు రాకుండ తప్పుకొని ప్రవర్తించాలి.

కుంతి కర్ణుని పుట్టినంతనే ప్రవాహంలో త్రోసి కులాన్ని తగ్గించింది. ఇప్పుడు యథార్థంచెప్పి మమతా బంధం విప్పి బలాన్ని తగ్గించింది.

కౌరవపక్షం నెగ్గితే కర్ణునికి కిరీటం రాదు. మర్యాద వుంటుంది; అంతే. కర్ణుడు ఇటు వస్తే, పాండవ పక్షం నెగ్గితే కర్ణునికి కిరీటం వస్తుంది. కర్ణజన్మ రహస్యం యుధిష్ఠిరునికి చెపితే? కుంతి చెప్పదు. చెపితే ఏం జరుగుతుందో ఆమెకు తెలుసు. ధర్మరాజు యుద్ధం చెయ్యడు. అన్న అయిన కర్ణుడు ఏది చెపితే అది చేస్తాడు. కర్ణుడు రాజరాజుకు గొడుగు పడతాడు. ధర్మజాదులు ఛత్ర చామరాలు పట్టుకోక తప్పదు. అందరూ బానిసలైపోతారు.

ఎక్కడ విన్నా ఏడ్పులే:

రణయజ్ఞం పూర్తి అయింది. గాంధారి కడుప
సమూలంగా కాలిపోయింది. దుర్యోధన దుశ్శాసనాదులు
వారి పుత్రులు, అందరు నేల కూలారు. ద్రౌపది కడుప
కాలిపోయింది. ఉపపాండవులు కన్ను మూశారు. సుభద్ర
కొడుకు అభిమన్యుడు వీరశయన మలంకరించాడు. వై
శుద్ధి అయిందన్న మాటే కాని, పాండవులకు ఒరిగిందేమి
లేదు. అక్కడ గాంధారి దుఃఖిస్తూ వుంటే, యిక్క
ద్రౌపది దుఃఖిస్తూ వుంది. గాంధారి అంటుంది. కోడలా
నీ దుఃఖమూ, నా దుఃఖమూ ఒకటే అని. రోదసి అంత
రోదన ధ్వనులతో నిండిపోయింది.

గాంధారి శాపం:

పాండవులు గాంధారిని దర్శించి పలుకరించాలి
కాని, ఆ సమయంలో, ఆ మహా పతివ్రతను సమీపించి
మాట్లాడడానికి ఎవరికీ గుండెలు లేవు. అంతటి మహా
సంగ్రామసాగర మిది, విజయం పొందిన కౌంతేయుల

ఆమె దృష్టిపథంలో పడితే భస్మమైపోతామని భయంతో వణకిపోతున్నారు. కనబడకుండ తప్పుకొనిపోతే శపిస్తుందని భయం. చివరకు శ్రీకృష్ణుని శపించనే శపించింది. యాదవవంశం అన్యోన్య కలహంతో అంతరిస్తుందని, కృష్ణుడు దిక్కులేని చావు చస్తాడని.

తమ తల్లి కుంతి యెక్కడుందో పాండవులకు కాబట్టు లేదు. ముందుగా గాంధారిని దర్శించాలి. క్షమించమని ఆమెను వేడుకోవాలి, తరువాత తల్లి. తెగించి ముందుకు వచ్చి గాంధారి కాళ్ల మీద బడ్డారు. ధర్మరాజు బాణీ వేరు. రాజ్యం నాకక్కర లేదు. పెదతండ్రికే అర్పిస్తా నంటాడు. ఏడుస్తాడు. ఆమె చల్లబడింది. వెళ్లి మీ తల్లిని చూడండి అంటుంది. అప్పుడు పాండవులు మళ్లీ తల్లి కడుపున పుట్టా మనుకొన్నారు.

**చేరెడు నీళ్లు పోయిస్తాను:**

కుంతి పాదాలమీదబడి పాండవులు బోరున ఏడుస్తారు. ఆ తల్లి కొడుకుల మేనులు నిమురుతూ, శస్త్రా

ప్రహరణాలతో ఏర్పడ్డ గాయాలు తడవుతూ పగులబడి ఏడుస్తుంది. ఇంతలో ద్రౌపది వచ్చి కడుపు చెరువుగా శోకిస్తుంది. కుంతికి మనుమ డొక్కడు కూడ మిగుల లేదు. సుభద్ర వచ్చి గొల్లుమంటుంది. తన కొడుకులు విజయం పొందారని సంతోషించడానికి లేదు. ఎక్కడ చూసినా రోదన ధ్వనులే. బీభత్స దృశ్యాలే. ఈ పరిస్థితిలో కుంతి మనస్సులో వైరాగ్యం చోటు చేసికొంది. కాని, కర్ణుని మృతి ఆమె మనస్సును కలవరపెడుతూ వుంది. కర్ణుడు తాను కడుపార కన్న బిడ్డ. బిడ్డకు తల్లి చేసిన మేలేమి? పసికందును వరదలో త్రోసివేసింది. తీరా భారత మహారణారంభ సమయంలో తెంపుచేసి, జన్మ రహస్యం తెలిపి, అతనితో వరం తీసుకొంది. ఇంతకంటె కీడు వుంటుందా? కర్ణుని తల తన కొడుకే నరికివేశాడు. కర్ణుడు తన అన్న అని తెలిసివుంటే, పార్థుడు తెగబడి అంత పని చేసేవాడా? ఈ భావాలు, ఒక దానిమీద ఒకటి పైకొంటూ గట్టును దాకే కడలి తరగల్లాగ ముట్టు

డించాయి. కుంతి తట్టుకోలేక పోయింది. 'బ్రతికి వుండగా కర్ణునికి ఏమీ ఉపకారం చేయలేక పోయాను. చచ్చిన వానికైనా కుల మర్యాదోచితంగా చేరెడు నీళ్లు పోయిస్తాను' అనుకొంది. అదొక్కటే ఆమె తుదికోర్కె ఆపుకోలేక ముందుకు వచ్చింది.

నీ అన్నకు తర్పణం చెయ్:

గంగాస్నానం చేసి, ధృతరాష్ట్రుడు, ధర్మనందనుడు, భీమాదులు మృతులయిన సర్వ కౌరవులకు తిలోదక ప్రదానం చేస్తున్నారు. జనం గుంపులు గుంపులుగా వున్నారు. ఆ సందడిలో కుంతి ముందుకు వచ్చింది. కన్నీళ్లతో మొగం తడిసి వుంది. 'ఇదిగో! తండ్రీ యుధిష్ఠిరా! కర్ణునికి తిలోదక ప్రదానం చెయ్యి. ఎవడు సహజకవచకుండలాలతో జన్మించాడో, ఎవడు కౌరవులకు పెట్టని కోటగా నిలిచాడో, ఎవడు మహాదాతగా ఖ్యాతి గన్నాడో, ఎవడు అసాధారణమైన తన భుజశక్తితో అంబర చారుల ప్రశంసలందుకొన్నాడో, ఎవడు అర్జునుని చేతి

అమ్మతో అస్తమించాడో వాడు కర్ణుడు నా పెద్దకొడుకు. నా చిన్ననాడు సూర్య వరప్రసాదంతో కన్నాను. లోకాప వాదభయంతో గంగలో వదిలాను. వాడు సూతుని చేతికి దొరికాడు. రాధేయుడయ్యాడు. స్వశక్తితో ప్రకాశించాడు. రాజ్యం సంపాదించాడు. సుయోధనుని ప్రాణసఖు డయ్యాడు. దైవోపహతుడై అస్తమించాడు. కర్ణుడు నా కొడుకు. కర్ణుడు నా కొడుకు తండ్రీ యుధిష్ఠిరా! మీ అన్నకు తర్పణంచెయ్' అంటూ కుంతి దుఃఖ భారంతో పడిపోయింది.

ఈ రహస్యం ఎలా దాచావు?

ఒక్క గుప్పిటు పది ఆగ్నేయాస్త్రాలు ఒక్కసారిగా గుప్పినట్లయింది. ధర్మజునికి మతిపోయింది. భీమార్జునులు తెల్లబోయారు. 'ఏమమ్మా! కర్ణుడు మాయన్నా?' పగులబడ్డాడు ధర్మపుత్రుడు. కర్ణుడున్నాడనే ధైర్యంతోనే దుర్యోధనుడు కయ్యానికి కాలు దువ్వాడు. కర్ణుని భుజ శక్తితోనే కౌరవులకు సామంతుల బలం పెరిగింది. కర్ణుని

తేరు వస్తూవుంది అంటే మనసేన చెల్లాచెదరయ్యేది. కర్ణుని మార్కొని మేమెన్ని సార్లో భంగపడ్డాము. కర్ణుడు ఎప్పు డేమి చేస్తాడో అని రేబవళ్లు నిద్రలేక అల్లాడి పోయాము. అటువంటి మహాశూరుని కని, తల్లీ! కొంగులో అగ్గి దాచు కొన్నట్లు, ఈ రహస్యం ఇంతకాలం ఎలా దాచావు?

తల్లీ! మాకెంత కష్టం తెచ్చి పెట్టావు? కర్ణుడు మా అన్న అని తెలిసివుంటే యింతటి మహాసంగ్రామం జరిగేదా? ఇందరు చచ్చేవారా? తల్లీ! ఎంత దారుణం జరిగింది? అభిమన్యుడు పోయినపుడుగాని, ఉపపాండ వులు పోయినపుడుగాని, కౌరవులు పోయినపుడుగాని, నాకింత నొప్పి కలుగలేదు. అని విలపిస్తూ కర్ణునికి తిలో దకాలిచ్చాడు.

స్త్రీలకు రహస్యం దాచే శక్తి లేకుండుగాక:

తరువాత నారదమహర్షి వస్తాడు. ధర్మరాజుకు కర్ణ వృత్తాంతం చెపుతాడు. కర్ణుడు సూతకులంలో పెరగడం,

బ్రాహ్మణశాపం, గురుశాపం, మాయా చతురుడై దేవేంద్రుడు కవచకుండలా లపహరించడం, తల్లినని వెల్లడించి కుంతి వరం పుచ్చుకొనడం, భీష్ముడు అర్ధరథునిగా నిర్ణయించి విలువ తగ్గించడం, అర్జునుణ్ణి చంపవలసిన ఇంద్ర శక్తిని ఘటోత్కచవధకు వ్యయంచేసే పరిస్థితి దాపురించడం, నాగాస్త్రం కృష్ణుని లాఘవంతో వృథాకావడం, శల్య సారథ్యం ఇలాంటి శతకోటి విఘ్నాలు ఉండికూడ, తుది దాక నిలబడి పరాక్రమం చూపాడు. కిరీటి కర్ణుని కూల్చిన వైనం మీకు తెలుసు. క్రీడికి కలిసివచ్చిన కృష్ణసారథ్యం, దేవతా వరప్రసాదం మీకు తెలుసు. కర్ణుడు అసహాయ శూరుడు....' ఈ మాటలు వింటూ ధర్మరాజు దుఃఖంతో తూలిపోతున్నాడు. కుంతీదేవి ప్రక్కనే వుంది. ధర్మ రాజును పట్టుకొంది. ఊరకుంటే బాగుండేది. 'ఏడు పొద్దు తండ్రీ! వానికి నేను చెప్పాను. నీవు నా కొడుకువురా. పాండవుల్లోకి రా. మీ తమ్ముడు ధర్మరాజు. నీకు రాజ్యమిస్తాడు. పోరు మానుతుంది అని. "కుంతి

చెప్పిన మాట సత్యం. నీవు కుంతీ పుత్రుడవే" అని సూర్యుడు కూడ సాక్ష్యమిచ్చాడు. వాడు వినలేదు. దుర్యోధనుని విడిచి నేను రానన్నాడు. అటువంటి మొండి వాని కోసం నీ వెందుకు దుఃఖిస్తావు? పోనీలే!' అనింది. అంటూనే ధర్మరాజు అగ్గి మండినాడు. 'నీ రహస్యరక్షణం వల్ల కదా యింతపని జరిగింది! స్త్రీలకు రహస్య రక్షణ శక్తి లేకుండు గాక!' అని శపించాడు. అప్పటి నుంచి స్త్రీలకు రహస్యరక్షణశక్తి పోయింది. 'ఆడుదాని నోట్లో నువ్వుగింజ నానదు' అనే సామెత తరువాత పుట్టిందే.

**కుంతికూడ అడవికి ....**

ధర్మరాజు రాజ్యం చేస్తున్నాడు. గాంధారీ ధృతరాష్ట్రులను భక్తితో సేవిస్తున్నాడు. కాని ధృతరాష్ట్రునికి మనస్సు కుదుట బడలేదు. లేచి పోదామనిపిస్తూ వుంది. ఒకనాడు ధర్మరాజుతో ఆ మాట చెబుతాడు. 'నేను మీకు చెరుపు చేశాను. నీవు నాకేలోటు లేకుండ చూచు

కొంటున్నావు. కాని నే చేసిన తప్పిదం శల్యమై నన్ను పీడిస్తూవుంది. నేను వనవాసంచేసి, మనోమాలిన్యం కడిగి వేసుకొంటాను. క్షత్ర జాతికి రెండే గతులు., రణమరణం లేదా, యోగమరణం. నీవిపుడు రాజువు. కనుక నీ అనుమతి కావాలి.' ధర్మజుడు వద్దంటాడు. ధృతరాష్ట్రుడు వినలేదు. నిరశన వ్రతం పట్టాడు. దప్పికి శోషిల్లి, కూర్చో లేక, గాంధారి మీదికి ఒరిగి మూర్ఛిల్లాడు. ధర్మరాజు భయపడ్డాడు. ఔరా! ఇనుప భీముని చూర్ణం చేసిన పది వేల యేనుగుల బలం కలిగిన మహాబలశాలి, తూలి అబల అయిన గాంధారి మీదికి ఒరిగాడు. విధి అని దుఃఖించాడు.

ఇంతలో వ్యాసులవారు విచ్చేశారు. అడ్డు చెప్పొద్దు మీ పెద్దయ్యను తపోవనానికి పంపించు అని ఆదేశించారు. ధర్మరాజు విధి లేక అంగీకరించాడు. అంధమహారాజు గాంధారి సహితంగా అడవికి వెళుతున్నాడనే వార్త ఊరంతా వ్యాపించింది. ఆబాలగోపాలం జనమంతా

చూడటానికి వచ్చారు. అంతఃపుర స్త్రీలు వృద్ధదంపతుల చుట్టు మూగారు. వారికి పాదనమస్కారాలు చేస్తున్నారు. ఏడుస్తున్నారు. ఈ సందడిలో కుంతీదేవి తాను గూడ అడవికి ప్రయాణం కట్టింది.

**నా నిర్ణయానికి తిరుగులేదు :**

ధృతరాష్ట్రుడు గాంధారి భుజంమీద చేయి వేసుకొని నడుస్తున్నాడు. గాంధారి కుంతి భుజంమీద చేయి వేసుకొని నడుస్తూవుంది. ధృతరాష్ట్రుడు తమను చూడ వచ్చిన మహాజనమును, కోడండ్రను అందరిని నిలువ మన్నాడు. ఎక్కడివారక్కడ నిలిచారు. కుంతి వెళుతూనే వుంది కనుక కోడండ్రు నిలువలేదు. ఆమె ననుసరించి వెళుతున్నారు. ధర్మరాజు గ్రహించాడు. తల్లి తెంపు చేసిందని. మెల్లగా తల్లిని సమీపించాడు. 'అమ్మా! మా అయ్య అడవికి వెళుతున్నాడు. ఆయన వెంబడి నేనూ వెళతాను. నీవు ఈ స్త్రీల నందరిని మరలించుకొని యింటికి వెళ్లు' అన్నాడు. కుంతి యిలా బదులు

చెప్పింది. 'వద్దు. నీ రాక రాజు ఒప్పుకోడు. ఈమె నాకు అత్త. రాజు మామ. వీరికి నేను శుశ్రూష చేయాలి. వీళ్లు అడవికి వెళ్లితే నేను ఇంట్లో వుంటానా? నా మన సొప్పదు. నేను వెళ్లాలనుకొన్నాను. వెళుతున్నాను. నా నిర్ణయానికి తిరుగులేదు.' అంటూ మెల్లగా గాంధారి చేయి తన భుజం మీదినుంచి తీసి, కొడుకు దిక్కు తిరిగి మాట్లాడుతూ వుంది. గాంధారీ ధృతరాష్ట్రులు మెల్లగా నడుస్తూ వున్నారు.

ధర్మజుడు కాళ్లకు అడ్డుపడ్డాడు. కుంతి అక్కడే వుంది. 'నాయనా! ధర్మా! నీవేమీ అడ్డు చెప్పొద్దు, తమ్ములను ప్రేమతో చూచుకో, కర్ణుని స్మరిస్తూ వుండు. నేను పాపం చేశాను. కర్ణుని జన్మవృత్తాంతం అణగ ద్రొక్కాను. నా మనసెప్పుడూ బాధపడుతూ వుంటుంది. కర్ణుని పేర దానధర్మాలు చేస్తూవుండు. పాపం కొంతైనా తరుగుతుంది. నన్ను గురించి బాధపడవద్దు. నేను వెళతాను' అని ఖండితంగా చెప్పింది.

నాకు రాజ్యఫలం అక్కర్లేదు :

భీమార్జునులు అడ్డుపడ్డారు. ధర్మజుడు వదలలేదు. 'అమ్మా! వెళతాననే మాట అనవద్దు. నే నొప్పుకోను. నీ విక్కడుండి తీరాలి. మాకు నీ సలహాలు, శ్రీకృష్ణుని సలహాలు లేకపోతే దిక్కుతోచదు. ఇందాక మాకు మంచి చెడ్డ చెపుతూ మమ్ము ఒక దారిలో నడిపించావు. ఇక ముందు కూడా మాకు నీ హస్తావలంబనం కావాలి.' అని బతిమాలుతున్నాడు. అప్పుడు భీముడందుకొన్నాడు. 'ఏమమ్మా! నీవు చెపితేగదా మేము యుద్ధం చేశాము. ఈ రోజు రాజ్యం వదలిపోతానంటావు. నీకేమి తక్కువైంది? నకుల సహదేవులు వనవాసంవల్ల వాడిపోతారని బాధపడ్డావు. మాకు రోషం పోశావు. ఇపుడు అందరినీ విడిచి వెళతానంటావు. మేమేమై పోయినా సరేనా?' అని తల విదిలించుకొంటూ కుమిలాడు. సోదరులందరు వాపోయారు. కోడండ్రు ద్రౌపదీ సుభద్రలు బావురుమన్నారు. కుంతికి కొంత యిబ్బంది కలిగింది. అయినా

లెక్క చేయలేదు. గట్టిగా మందలిస్తేగాని వీరు పోరని, కన్నీళ్లు తుడుచుకొంటూ ఇలా సమాధానం చెప్పింది. పరిజనం కూడ వింటున్నారు. 'మాయజూదంలో మీరు పరాజితులయ్యారు. దుశ్శాసనుడు ద్రౌపదిని కొప్పుపట్టి యీడ్చి సభలోకి తెచ్చాడు. అవమానించాడు. పెద్దలు పలుకకుండ కూర్చున్నారు. అంతా ఓర్చు కోవలసి వచ్చింది. అడవులకు వెళ్లి, చచ్చి బ్రతికి వచ్చారు. వచ్చి సంధి అంటే నా ఒళ్లు మండింది. సరివారు నవ్వుతారనే సిగ్గులేదా? కొడుకు లీ స్థితికి దిగజారితే పాండురాజు ప్రతిష్ఠ మంట కలిసిపోదా, అందుకే రాయబారం వచ్చిన కృష్ణునితో నిష్ఠూరంగా మాట్లాడాను. మీరు వన్నెకు రావాలనేకాని, నేను బ్రహ్మారథం పట్టించు కోవాలని కాదు.

పుత్రులారా! మీరు ప్రతిజ్ఞ చెల్లించుకొన్నారు. చల్లగా రాజ్యమేలుకొంటున్నారు చాలు. మీ ప్రాపున వుండి ఎన్నో ఉత్తమదానాలు చేశాను. జగన్మాతంగా

మీరు చేసిన యజ్ఞం కన్నులారా చూశాను. నాకే కొరత లేదు. మీరేమీ అనుకోవద్దు. నేను వెళతాను. సంతోషంగా పంపండి.

నాకు రాజ్యఫల మక్కర లేదు. తపఃపరమార్థ ఫలమైన ఉత్తమ సిద్ధి కావాలి. అది సాధన చేతగాని సమకూరదు. సాధనకు మంచి తోడు అవసరం. ఇటువంటి పెద్దల తోడుపాటు మరి నాకు తటస్థించదు. గాంధారీ ధృతరాష్ట్రులకు పరిచర్య చేస్తూ తపోదీక్షతో జీవితశేషం గడుపుతాను. నేను రాను.'

ముందుగా నడిచి వెళుతున్న ధృతరాష్ట్రుని కీ సంగతి తెలిసింది. కొడుకులెంత ప్రాధేయపడినా కుంతి వినటం లేదని ఆయన విదురుని, సంజయుని కుంతి దగ్గరకు పంపించాడు. 'ధర్మనందనుడు చెప్పిన ప్రకారం చేయవలసిందని' కుంతి వినలేదు. తన దృఢనిశ్చయం మాటి మాటికి ఉద్ఘాటించింది. అందరు ప్రదక్షిణం చేసి కుంతి

పాదాలపై బడ్డారు. తల్లిని వృద్ధ దంపతులకు అప్పగించి ధర్మరాజు సెలవు తీసుకొన్నాడు.

కుంతి అడవికి వెళ్ళింది.

నీ చరిత్ర నిర్మలం :

ఒకనాడు బంధుమిత్ర పరివారసమేతంగా ధర్మరాజు అడవికి వెళ్ళి, గాంధారీ ధృతరాష్ట్రులను కుంతిని సందర్శించాడు. అంతలో వ్యాసులవారు అక్కడికి విచ్చేశారు. అందరు సంతోషించారు. వ్యాసులు ధృతరాష్ట్రుని చూసి, "నీకేమైనా కోరిక వుంటే అడుగు, ఇస్తా" నన్నారు. నీ దర్శన భాగ్యమే చాలు నంటాడు వృద్ధరాజు. గాంధారి కోరిక వేరుగా వుంది. రణరంగంలో ప్రాణాలు వదలిన తన కొడుకు లేమైనారో వారిని చూపమంటుంది. ఆ మాట వినేసరికి సుభద్రకు, ద్రౌపదికి ఆశ కలుగుతుంది. తమ కొడుకులను చూడాలని, కుంతి మనసులో కర్ణుడు మెదిలాడు. వ్యాసు లది గుర్తించారు. కుంతి వా విడిచి

చెపుతుంది. కర్ణుడు నా కొడుకే. నా కన్యాత్వదశలో, మంత్రబలంతో రవిని రప్పించి కన్నానని వివరించి, తప్పో ఒప్పో యిది యిలా జరిగిపోయిందని చెప్పి యేడుస్తుంది. వ్యాసుల హృదయం ఆర్ద్రమవుతుంది. 'కోడలా! నీవు చెప్పినదంతా నిజం. నీలో దోషం ఈషన్మాత్రం కూడ లేదు. భయపడకు. సురలు అద్భుతాలు చేస్తూవుంటారు. కర్ణుని కనేవరకే నీ బాధ్యత. తరువాత అది అలా జరుగవలసి వుంది జరిగింది. నీకు కన్యాత్వహాని కలుగలేదు కనుక నీవు కులాగ్రగణ్య వయ్యావు. నీ చరిత్ర నిర్మలం, అని ఆదరపూర్వకంగా ఓదార్చాడు.

మృతవీరుల ఆగమనం:

వ్యాసులవారు భారతమృత వీరులను చూపిస్తారని పౌరజానపదులు తండోపతండాలుగా వచ్చారు. సరే అంతా గంగాతీరానికి వెళ్ళండి. రేపు ఉదయం చూపిస్తా నని సెలవిచ్చారు వ్యాసులు. తెల్లవారింది. అందరు శుచులై నిలిచారు. వ్యాసులు గంగాజలావగాహనం చేసి,

మృతవీరులనందరిని ఆహ్వానించారు. నీళ్ళలో ఒక విచిత్ర ధ్వని పుట్టింది. రాజరాజు, అతని తమ్ముళ్లు, కొడుకులు, కర్ణుడు, అభిమన్యుడు, ద్రౌపదేయులు, బాహ్లికాదులు, ద్రుపద విరాటాదులు, శకుని భీష్మ ద్రోణ పురస్సరంగా అందరు వస్తున్నారు. దివ్యమాల్యాలు, దివ్యవస్త్రాలు, దివ్యభూషణాలు, దివ్య లేపనాలు, దివ్యదేహాలు, ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. సుభటులు కూడ వస్తున్నారు. పరస్పర ప్రణయంతో అందరు ఆనందిస్తున్నారు. వారిని అప్సరసలు సేవిస్తున్నారు. గంధర్వులు వారి కీర్తి గానం చేస్తున్నారు. ఈ వింతదృశ్యం చూడడానికి ధృతరాష్ట్రునికి దివ్యదృష్టి యిచ్చారు వ్యాసులు. ఈ విషయం తెలిసి, గాంధారి తన నేత్రాలకు అడ్డంగా కట్టుకొన్న పట్టం తొలగించి ఆనందంతో కొడుకులను, మనుమలను, తోబుట్టువులను భీష్మాది మహావీరులను చూచింది. ఆ వచ్చిన దివ్యులందరు తమ వారల కలిసికొని ఆనందించారు. ఆ రాత్రి అక్కడే నిలిచారు. మరునాటి ఉదయం తిరిగి వెళ్ళారు.

కుంతీదేవి తన జ్యేష్ఠ పుత్రుడైన కర్ణుని తనివితీర చూసి ఆనందించింది.

ధర్మజాదులు సెలవు తీసికొని హస్తినాపురం వెళ్ళారు. కొంతకాలం గడిచింది.

దావాగ్నికి ఆహుతి:

గాంధారి ధృతరాష్ట్రులు, కుంతి, సంజయుడు నలుగురు ఆశ్రమం వదలి, గంగాద్వార పరిసరారణ్య ప్రాంతాలకు వెళ్ళి, తపస్సు చేయాలని సంకల్పించారు. ధృతరాష్ట్రుడు గాలితప్ప మరే ఆహారం తీసుకోలేదు. గాంధారి మంచినీళ్ళు మాత్రం సేవిస్తూవుంది. కుంతి నెల రోజుల ఉపవాసవ్రతం అవలంబించింది. సంజయుడు వారానికి ఒకపూట భోంచేస్తున్నాడు. అంధరాజుకు సంజయుడు, గాంధారికి కుంతి తోడై దారిచూపుతున్నారు. ఒకరోజు గంగాద్వారంలో స్నానంచేసి, ఆశ్రమానికి తిరిగి వస్తున్నారు. ఘోరమైన దావాగ్ని చుట్టుకొనింది. ఛటచ్ఛట

ధ్వనులతో విజృంభిస్తూ వుంది. గాలి రేగింది. పక్షులు మృగాలు అగ్గిలోబడి మగ్గిపోతున్నాయి. దారి కనిపించడం లేదు. ఆకాశమంతా ధూమ ధామంగా వుంది. మహా వృక్షాలు మండి పోతున్నాయి. ధృతరాష్ట్రుడన్నాడు. 'నాయనా సంజయా! నీవు దాటుకో. మేము ఎలాగూ పోలేము.' అంటే సంజయుడు 'మహారాజా! మిమ్మల్ను వదలి నేనెలా వెళతాను?' అన్నాడు. ఛీ ఛీ! తప్పించుకోవడానికి, వీలుండి ప్రాణాలు పోగొట్టుకొనడం పాపం. ముందు నీవు తప్పుకో అన్నాడు ధృతరాష్ట్రుడు. అయితే నేను తప్పుకొంటాను. మీరు యోగమవలంబించండి అన్నాడు సంజయుడు. అంటూ ఒక్కవూపులో హిమగిరి యెక్కాడు. అగ్ని చుట్టుకొనింది. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి ముగ్గురు యోగనిష్ఠులై కూర్చున్నారు. ఒక్కపెట్టున ఏనుగు మీదికి సింహం దూకినట్లు, ధగ ధగ మండే దావానలజ్వాల గాలికి దూసుకొని వచ్చిపడింది. ముగ్గురు పంచత్వం పొందారు.

ధర్మజుడు పరలోకక్రియలు నిర్వహించాడు.

కుంతి సిద్ధి, మాద్రి బుద్ధి, ఇద్దరు దేవతలు భూమిపై అవతరించారని భారతం చెపుతుంది.